ఓమ్

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# భక్తి - వైరాగ్యము



గ్రంథకర్త

శ్రీ చిన్మయరామదాసు

# విషయసూచిక



గ్రంథకర్త

## శ్రీ చిన్మయ రామదాసు



శ్రీ మలయాళ సద్గురుపరబ్రహ్మణే నమః

శ్రీ గణేశాయ నమః శ్రీ శారదామాత్రే నమః

# భక్తి, వైరాగ్యము

భగవత్సంకీర్తన

1. శ్రీరామ జయరామ జయ జయ రామ
శ్రీహరి శ్రీకృష్ణ శ్రీధర రామ॥

2. కామంబు బాపర కళ్యాణరామ
క్రోధంబు బాపర కోదండరామ.

3. లోభంబు బాపర లోకాభిరామ
మోహంబు బాపర మోహనరామ.

4. మదమును ద్రుంచర మాధవరామ
మాత్సర్య ముడపర మహనీయరామ.

5. పాపంబు బాపర పావనరామ
పతితుల గాపాడే పరమాత్మరామ.

6. అజ్ఞానమును బాపు అయోధ్యరామ
ఆశ్రితజనవంద్య ఆనందరామ.

7. దానవాంతక నన్ను దయజూచి రామ
ధర్మంబుతో నడుపు దశరథరామ.

8. చిన్మయదాసుని శ్రీరఘురామ
శ్రీఘమె బ్రోవుము శ్రీ సీతాపతిరామ.

ఓమ్

# ఈశ్వరుడు చెప్పిన సుప్రభాతమ్

శ్లో. బ్రహ్మా మురారి స్త్రిపురాంతకారి
భానుశ్శశీ భూమిసుతో బుధశ్చ
గురుశ్చ శుక్ర స్సహభానుజేన
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. 1

శ్లో. భృగుర్వశిష్ఠః క్రతురంగిరాశ్చ
మనుః పులస్త్యః పులహః సగౌతమః
రైభ్యోమరీచి శ్చ్యవనో ఋభుశ్చ
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. 2

శ్లో. సనత్కుమార స్సనక స్సనందనః
సనాతనో ప్యాసురి పింగళేచ
సప్తస్వరా స్సప్తరసాతలాశ్చ
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. 3

శ్లో. పృథ్వీసగంధా సరసా స్తథాపః
స్పర్శశ్చ వాయు ర్జ్వలన స్సతేజాః
నభ స్సశబ్దం మహతాసహైవ
యచ్ఛంతు సర్వే మమ సుప్రభాతమ్. 4

శ్లో. సప్తార్ణవా స్సప్తకులాచలాశ్చ
సప్తర్షయో ద్వీపవరాశ్చసప్త
భూరాది కృత్వా భువనానిసప్త
దదంతు సర్వే మమ సుప్రభాతమ్. 5

శ్లో. ఇత్థంప్రభాతే పరమం పవిత్రం
పఠేత్ స్మరేద్వా శృణుయాచ్ఛభక్త్యా
దుస్స్వప్ననాశోఽనఘ సుప్రభాతం
భవేచ్ఛ సత్యం భగవత్ప్రసాదాత్. 6
(వామన పురాణము)

## భక్తి విభాగము

శ్లో. మంత్రే తద్దేవతాయాంచ తథా మంత్రప్రదే గురౌ
త్రిషుభక్తి స్సదాకార్యా సాహి ప్రథమ సాధనమ్.

తా. మంత్రమునందు, మంత్రాధిష్ఠాన దేవతయందు, మంత్రోపదేశము చేసిన సద్గురువునందును సాధకులు భక్తి గలిగి సేవించుచుండుట ప్రథమ సాధన యగును.

శ్లో. ఆజీవితంత్రయం సేవ్యా గురువేదాంత ఈశ్వరః
మనసా కర్మణా వాచా శ్రుతే రేవైష నిశ్చయః.

తా. జీవితపర్యంతమును శరీరముతో, వాక్కుతో, మనస్సుతోను గురువును, ఈశ్వరుని, వేదాంతధర్మమును భక్తితో మరువక గౌరవించుచుండవలెను. ఇది వేదము యొక్క నిశ్చయ సిద్ధాంతము.

శ్లో. సత్యం బ్రవీమి పరలోకహితం బ్రవీమి
సారం బ్రవీ మ్యుపనిష ద్హృదయం బ్రవీమి
సంసార ముల్బణ మసార మవాప్యజంతో
స్సారోయ మీశ్వరపదాంబురుహస్య సేవా.

తా. నేను సత్యము చెప్పెదను. పరసుఖముగల్గు వాక్యము (ఉపాయము) చెప్పెదను. సారమైన విషయము చెప్పెదను. ఉపనిషత్తుల హృదయమును చెప్పుచున్నాను. అదేదనగా సారహీనమైన, దుఃఖనిలయమైన ఈలోకములో (సంసారములో) మానవులకు సారమైనది, దుఃఖములను నశింపజేయునది భగవంతునియొక్క పాదపద్మముల సేవయే యగును.

శ్లో. అభిమానం సురాపానం గౌరవం రౌరవం సమమ్
ప్రతిష్ఠా సూకరీవిష్టా త్రయం త్యక్త్వా హరిం భజేత్.

తా. 'నేను' అనెడి దేహాభిమానము కల్లువంటిది. గౌరవాభిలాష రౌరవనరకముతో సమమైనది. ప్రతిష్ఠ యనునది పందిమలమువంటిది. కనుక ఈ మూటిని వదలి భగవంతుని భజించవలయును.

శ్లో. కేచి ద్వదంతి ధనహీన జనోజఘన్యః
కేచి ద్వదన్తి కులహీన జనోజఘన్యః
వ్యాసోవద త్యఖిలవేద విశేషవిజ్ఞో
నారాయణస్మరణ హీనజనోజఘన్యః.

తా. కొందరు ధనహీనుని అల్పుడని చెప్పుచున్నారు. మరికొందరు కులహీనుని అల్పుడని చెప్పుచున్నారు. సర్వ వేదముల దెలిసిన వ్యాసులవారన్ననో శ్రీమన్నారాయణ స్మరణ లేనివాడే అల్పుడని చెప్పెను.

శ్లో. క్షణంవా నవృథాకాలం నయేద్యస్తు స ధన్యవాన్
స ఏవ సుకృతీలోకే పూర్ణవైరాగ్య భాగ్యవాన్.

తా. ఎవడు ఒక్కక్షణకాలమైనను వృథాచేయక దైవచింతనతో గడుపుచుండునో, అట్టివాడే ధన్యుడు. అతడే ఈలోకములో మహాసుకృతము నాచరించినవాడు. అతడే పూర్ణవైరాగ్య మను మహాభాగ్యము నొందినవాడు.

శ్లో. యన్ముహూర్తం క్షణంవాపి వాసుదేవో నచింతితః
సాహానిస్త న్మహచ్ఛిద్రం సాభ్రాంతి స్సాచ విక్రియా
ఏకస్మి న్నప్యతిక్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే
దస్యుభిర్ముషితే నైవ యుక్తమాక్రందితుం భృశమ్.

తా. ఏ ముహూర్తమైనను క్షణకాలమైనను, భగవద్ధ్యానముండదో. అదియే గొప్పకీడుగను, లోపము (కొరత) గను, భ్రాంతిగను, వికారముగను తలంచవలెను. అల్పకాలమైనను భగవద్ధ్యానములేక గడచిపోయిన యెడల తన సర్వస్వమును దొంగలు దోచుకొనిపోయినట్లే ఏడ్వవలయును.

## నిజమైన నిష్కామభక్తులు

శ్లో. న కించి త్సాధవోధీరా భక్తాహ్యే కాంతినో మమ
వాంఛ న్త్యపి మయాదత్తం కైవల్య మపునర్భవమ్.

తా. సజ్జనులు, ధీరులు నగు నా ప్రియభక్తులకు కోరికలుండవు. నేను వారికి మోక్షమొసంగవలయునని తలంచిననుకూడ వారు దానిని వాంఛించరు.

శ్లో. న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్
న యోగసిద్ధీ ర్న పునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్.

తా. నా భక్తుడు బ్రహ్మపదమును, ఇంద్రపదమును, సార్వభౌమపదమును, పాతాళలోకాధిపత్యమును, యోగసిద్ధులను, మోక్షమును కూడ కోరడు. వానికి నామీద తప్ప నింకొకదానిపై ప్రేమయుండదు. (భాగవతము)

## విష్ణుభక్తుల పలుకులు

శ్లో. నిందంతు బాంధవా స్సర్వే త్యజంతు స్త్రీ సుతాదయః
జనాః హసంతు మాం దృష్ట్వా రాజానో దండయంతు వా
సేవేసేవే పునస్సేవే త్వామేవ పర దేవ తే
త్వత్కర్మ నైవ ముంచామి మనోవాక్కాయకర్మభిః.

తా. ఓ సర్వేశ్వరా! బంధువులందరున్ను నన్ను నిందించినను, భార్యాపుత్రులు బంధువులున్ను నన్ను వదలివేసినను, రాజు నన్ను దండించినను, జనులు నన్ను చూచి నవ్వుచున్నను భగవంతుడా, నీ సేవే చేసెదను. మనోవాక్కాయములచే నీ సేవను వదలియుండను.

శ్లో. అపి కీటకః పతంగో వా, భవేయం శంకరాజ్ఞయా
నతు శక్రత్వయాదత్తం త్రైలోక్యమపి కామయే.

తా. నేను శంకరుని ఆజ్ఞ ప్రకారము పురుగుగాగాని, పక్షిగాగాని కాగలనుగాని, ఓ యింద్రా! నీ విచ్చునట్టి మూడు లోకములను కోరను. (ఉపమన్యుడు)

శ్లో. ఆత్మరాజ్యం ధనం చైవ కలత్రం వాహనం తథా
ఏ తద్భాగవతం సర్వ మితి తత్ ప్రేక్షతే సదా.

తా. నా సంబంధమగు రాజ్యము, ధనము, భార్య, వాహనమును ఈ సర్వమును భగవత్సంబంధమైనవిగా ఎల్లప్పుడును నేను చూచుచున్నాను. (ఉపరిచరవసువు)

శ్లో. పృధ్వీ శేషధృతా స శంభుముకుటే కైలాసవాసోఽప్యసౌ
కైలాసోఽపిదశాననేన తులితో బద్ధోఽప్యసౌవాలినా
వాలీ రాఘవ విష్ణు నాయుధిజితో విష్ణుస్సతాం మానసే
తస్మాద్విష్ణుపరాయణాద్గురుతరో నాన్యోస్తి లోకత్రయే.

తా. ఈ భూమండలమంతయు శేషనాగునిచే (ఆదిశేషునిచే) ధరింపబడినది. ఈ శేషుడు శివునికి కిరీటమందున్నాడు. ఈ శివుడు కైలాసవాసుడు. ఈ కైలాసమును రావణాసురు డెత్తినాడు. ఈ రావణుడు వాలికి బద్ధుడైనాడు. ఈ వాలి, విష్ణు స్వరూపుడగు శ్రీరాముని ఆయుధముచే చచ్చెను. ఆ విష్ణు భగవానుడు భక్తుల హృదయములో కట్టుబడియున్నాడు. అందువలన మూడు లోకములందును, భగవద్భక్తులకు మించిన శ్రేష్ఠులు లేరు.

శ్లో. యది భవతి ముకుందే భక్తిరానందసాంద్రా
విలుఠతి చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః.

తా. భగవంతునియందు ఎవనికి గాఢమైన భక్తి కుదురునో, దైవానందస్థితి గలుగునో అతని పాదపద్మము లను మోక్షసామ్రాజ్యలక్ష్మి తాకి తనను వరించుమని వేడు కొనును. (ముకుందమాల)

## ఎవనికి ఈశ్వరానుగ్రహము గల్గును

శ్లో. పాపం క్రోధం అనైకాగ్ర్యం యోగసిద్ధించ నైతియః
తమీశ్వరోనుగృహ్ణాతి సజ్ఞానేనైవ మాప్నుయామ్.

తా. ఎవనికి పాపము, క్రోధము, మనశ్చాంచల్యము యోగసిద్ధులపై ప్రీతియు లేవో, అతనినే ఈశ్వరుడు అను గ్రహించును. అతడే ఆత్మజ్ఞానము నొందును.
(అనుభూతి ప్రకాశము)

శ్లో. దేవ ద్విజ గురు శ్రద్ధా భరబంధుర చేతసామ్
సదాగమ ప్రమాణానాం మహేశానుగ్రహోభవేత్.

తా. దేవతలపై, పెద్దలపై, గురువులపై మిక్కిలి భక్తి విశ్వాసములుగల మనస్సుగలవానికి, వేదశాస్త్రానుసారముగా నడచువానికి ఈశ్వరానుగ్రహము గల్గును. (వాసిష్ఠం)

శ్లో. యావన్నానుగ్రహః సాక్షా జ్ఞాయతే పరమేశ్వరాత్
తావన్న సద్గురుం కశ్చ సచ్ఛాస్త్రంవాపినో లభేత్.

తా. ఎంతవరకు పరమేశ్వరానుగ్రహము కలుగలేదో అంతవరకును మనకు మంచి గురువుగారు లభించరు. మంచి గ్రంథముకూడ లభించదు.

శ్లో. ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా
మహాభయ పరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే.

తా. సంసారమహాసముద్రమును తరించవలెనని కోరుచున్న మానవునికి ఈశ్వరానుగ్రహమువల్లనే అద్వైతజ్ఞాన సంపాదనయందు ప్రీతి, పట్టుదలయు గలుగును.

## భక్తులను రక్షించెదనని భగవంతుడు చెప్పుట

శ్లో. లక్ష్మీంవాపి పరిత్యక్ష్యే ప్రాణాన్ దేహమథాపివా
శ్రీవత్సం కౌస్తుభం మాలా వైజయంతీ మథాపివా
శ్వేతద్వీపంచ వైకుంఠం క్షీరసాగర మేవచ
శేషంచ గరుడంచైవ న భక్తం త్యక్తు ముత్సహే.

తా. (శ్రీమహావిష్ణువు యమధర్మరాజుతో) యమధర్మరాజా! లక్ష్మీదేవిని, ప్రాణమును, దేహమును, శ్రీవత్సమును, కౌస్తుభమును, వైజయంతీమాలికను, శ్వేతద్వీపమును, వైకుంఠమును, పాలసముద్రమును, ఆదిశేషుని, గరుత్మంతుని మొదలగువానిలో దేనినైనను విడిచిపెట్టుదునుగాని, భక్తుని విడుచుట మాత్రము నేనొప్పుకొనను.

## భక్తుల (భాగవతుల) లక్షణములు

శ్లో. సత్వస్థా స్సాత్త్వికాన్ధర్మా న్విష్ణుప్రీతికరాన్ శుభాన్
కుర్వంత్యనీహయానిత్యం తేవై భాగవతాః స్మృతాః.

తా. సత్త్వగుణవంతులును, సాత్త్వికమైన ధర్మములుగలవారును, భగవానునికి ప్రీతిని గలిగించునట్టి శుభకరములైన

పనులను అహంబుద్ధిని వదలి చేయుచుండువారును అగు మానవులే భాగవతు లనబడుదురు.

శ్లో. యేషాం చిత్తం సదా విష్ణౌ జిహ్వాయాం నామవై విభోః
పాదేచ హృదయే యేషాంతేవై భాగవతాః స్మృతా.

తా. ఎవరిచిత్తము ఎల్లప్పుడును విష్ణువునందు సంలగ్నమై యుండునో, ఎవరి నాలుక భగవన్నామమును కీర్తించుచుండునో, ఎవరి హృదయమున భగవంతుని పాద పద్మములు పూజింపబడుచుండునో వారే భాగవతు లనబడుదురు.

శ్లో. సదాచార రతాయేచ, సర్వేషా ముపకారకాః
సదైవ మమతాహీనా స్తేవై భాగవతా స్మృతా.

తా. మంచి శుచి ఆచారములుగలవారును, అన్ని ప్రాణులకును ఉపకారము చేయు స్వభావముగలవారును, 'నావారు, నాది' యను మమకారమును వదలి సదా దైవ చింతనతో నుండువారును భాగవతు లనబడుదురు.

శ్లో. యేషాం చ శాస్త్రే విశ్వాసో, గురౌ సాధుషు కర్మసు
యే విష్ణు భక్తా స్సతతం తేవై భాగవతాః స్మృతా.

తా. ఎవరు శాస్త్రమునందును, గురువునందును, సత్కర్మలయందును విశ్వాసము గలిగియున్నారో, ఎవరు ఎల్లప్పుడును విష్ణుభగవానునిపై భక్తి గలిగి యుండిరో వారే భాగవతు లనబడుదురు.

శ్లో. శివేచ పరమేశేచ విష్ణౌచ పరమాత్మని
సమ బుద్ధ్యా ప్రవర్తంతే, తేవై భాగవతాః స్మృతాః

తా. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పరమాత్మ స్వరూపులని సమబుద్ధితో గాంచి గౌరవించుచు నెవరున్నారో, వారే భాగవతులని చెప్పబడుదురు.

శ్లో. నక్రోధో నచ మాత్సర్యం న లోభో నాఽశుభామతిః
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే.

తా. పుణ్యకర్మశీలురగు భగవద్భక్తులలో క్రోధము, అహంకారము, లోభగుణము, చెడ్డబుద్ధియు నుండదు.

## నారదుని భక్తిమయ బాల్యచేష్టలు

సీ. ధూళిధూసరిత గాత్రుండుగాగ నడివీధి
నాడుచు భక్తిమై హరిని బాడు
ధూళి ప్రోగిడుచు గోపాల విగ్రహముగా
బూజించు ధూళిచే బూవులనుచు
బుధులు వీధిబురాణములు విష్ణుగాథ లో
య్యన బఠింపగఁ జేరి యాలకించు
బఠియింప జేయు శ్రీపతిమంత్రముల ధూళి
వ్రాయుచు దన తోడిబాలకులను

గీ. చూడబోయినవా రింటిగోడలందు
వాసుదేవుని ప్రతిమల వ్రాయుచుండు
తల్లిచంకన యుండి గాత్రముల నిండ
గీట్లుగా గీయు హరిమంత్ర కీర్తనముల.

శ్లో. అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్స్మరే త్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః

తా. శరీరము, వస్త్రము, నివాస స్థలమును అపవిత్రముగా నున్నను, పవిత్రవంతముగా నున్నను, అనేక పనులతో బాధలతో నున్నను ఎవడు భగవంతుని స్మరణ చేయుచుండునో అతడు బైటను, హృదయములోపలను పరిశుద్ధుడగును.

శ్లో. తిష్ఠతాగచ్ఛతావాపి స్వపతాజాగ్రతాపివా
శయానోప విశేషేన జప్యో నారాయణ స్సదా.

తా. కూర్చొని యున్నపుడు, నడచునపుడు, నిద్రించునపుడు (స్వప్నములో). జాగ్రదావస్థయందున్నపుడు, పరుండి యున్నపుడు, భోజనాదిపనుల జేయునపుడును సర్వదా మనస్సునందు శ్రీమన్నారాయణుని స్మరణ చేయుచుండవలెను.

శ్లో. కింతేన జాతమాత్రేణ భూభారేణాన్నశత్రుడా
యోజాతోనార్చయే ద్విష్ణుం పితౄ న్దేవా నృషీం స్తథా.

తా. ఎవడు విష్ణుమూర్తిని, పితృదేవతలను, ఋషులను (మహాత్ములను) పూజింపడో, వానివలన భూభారము కొరకును, అన్నము తినుటకునుగాక ఏమి ప్రయోజనముండును? (వ్యర్థజీవితమని తాత్పర్యము)

(స్కాందపురాణము)

## కలి యెవరిని బాధించదు ?

శ్లో. యద్గృహే వైశ్వదేవశ్చ యద్గృహే తులసీ శుభా
యదంగణే శుభాగాశ్చ నతం వై బాధతే కలిః.

తా. ఏ గృహమందు వైశ్వదేవము ( అనగా వంట పూర్తియైన తరువాత అగ్నిదేవునికి అన్నము, నెయ్యి, మధుర పదార్థములను అర్పించి నమస్కరించుట ) చేయుచున్నారో, ఏ గృహమందు తులసి చెట్టు కలదో, ఎవరి గృహము ముందర గోవు కలదో ఆ గృహమునందున్న వారిని కలిమాయ బాధించదు.

శ్లో. సాలగ్రామ శిలాయస్య గృహే తిష్ఠతి మానద
అథవా భారతం గేహే నతం వై బాధతే కలిః.

తా. ఏ గృహమందు సాలగ్రామశిల పూజింపబడు చుండునో, మరియు భారతమైనను ఏ గృహమునందు పఠింపబడుచుండునో ఆ గృహమందున్నవారిని కలిమాయ బాధించదు.

శ్లో. యే చ విష్ణుకథారక్తా యే స్మరం త్యనిశం హరిం
యే సదాచారనిరతా నతా న్వై బాధతే కలిః.

తా. ఎవరు భగవత్కథలయందు ఆసక్తిగలవారై యుందురో, ఎవరు నిత్యమును భగవంతుని స్మరణ చేయుచు నుందురో, ఎవరు మంచినడవడికగలవారై యుందురో అట్టివారిని కలిమాయ బాధించదు.

( స్కాందపురాణము )

## భక్తియొక్క శ్రేష్ఠత్వము

శ్లో. యస్మిన్ శాస్త్రే పురాణేవా హరిభక్తి ర్నదృశ్యతే
శ్రోతవ్యం నైవత చ్ఛాస్త్రం యది బ్రహ్మ స్వయంవదేత

తా. భగవద్భక్తిని గురించి చెప్పబడని శాస్త్రములను, పురాణములను వినకూడదు. ఈవాక్యమును బ్రహ్మదేవుడు స్వయముగా చెప్పెను.

శ్లో. మద్భక్తి విముఖానాంహి శాస్త్రగర్తేషు ముహ్యతాం
నజ్ఞానం నచ మోక్షస్స్యా త్తేషాం జన్మశతైరపి.

తా. భగవంతుడనగు నాయందు భక్తి నుంచక కేవలము శాస్త్రవాసన యనెడి గోతిలో పడియున్నవానికి నూరుజన్మలకు కూడ జ్ఞానమున్ను, మోక్షమున్ను కలుగదు.

శ్లో. యోగం కర్మంచ సాంఖ్యంచ తపోధ్యానం వ్రతం శ్రుతం
వ్యర్థంహి భక్తిహీనస్య వృష్టిహీనా కృషిర్యథా.

తా. వర్షములేని వ్యవసాయపు కృషి వ్యర్థమగునట్లు పరమాత్మయందు భక్తినుంచనిచో యోగాభ్యాసము, కర్మలు, సాంఖ్యవిచారణ, తపస్సు, ధ్యానము, వ్రతములు, వేదాంతాదిశాస్త్ర శ్రవణములున్ను వ్యర్థము లగును.

శ్లో. యోగోజ్ఞానం తథా సాంఖ్యం, విద్యాశ్శిల్పాది కర్మచ
వేదశాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ః

తా. యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్య, వ్యవసాయాది కర్మలు, వేద శాస్త్ర ధర్మజ్ఞానవిచారణాద్యను

భవములున్ను పరమాత్మను భజించి పొందుట కొరకే ఏర్పడినవి.

శ్లో॥ పితృ మాతృ హిత భ్రాతృ దార పుత్రా దయోపివా
ఏకైక ఫలలాభాయ సర్వలాభాయ కేశవే.

తా. తల్లి తండ్రి, భార్య సోదరులు, పుత్రులు, స్నేహితులు మొదలైన వారిని ఆశ్రయించినచో (నమ్మి యున్నచో) ఒక్కొక్క లాభమే కలుగును. భగవంతుని ఆశ్రయించి నమ్మి కొలుచుచున్నచో సర్వలాభములున్ను కలుగును.

## భక్తుల భావ భేదములు

శ్లో. దేహబుద్ధ్యాతుదాసోస్మి జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ మితిమే నిశ్చితామతిః.

తా. ఓ భగవంతుడా! దేహబుద్ధితో నీకు నేను దాసుడనై యున్నాను. జీవబుద్ధితో నీ యంశమై (నీ బిడ్డనై) యున్నాను. ఆత్మబుద్ధితో చూడగా నీవే నేనై యున్నాను. ఇవి నా నిశ్చయాభిప్రాయములు.

శ్లో. సత్యపి భేదాపగమేనాథ తవాఽహం నమామకీన స్త్వం
సాముద్రోహి తరంగః క్వచ న సముద్రో న తారంగః.

తా. స్వామీ! నాకును, తమకును మధ్యగల సకల భేదములున్ను విలయ మొందినవి (నశించినవి). నేను తమవాడనేగాని, తమరు నావారు కారు. ఎట్లన. సముద్రము లోనివే అలలుగాని, అలలలోనిది సముద్రము కాదుగదా!

(శంకరులు)

శ్లో. కర్మావలంబకాః కేచిత్ కేచిత్ జ్ఞానావలంబకాః
వయంతు హరిదాసానాం పాదరక్షావలంబకాః.

తా. లోకములో కొందరు కర్మయోగమును ఆశ్రయించి చేయుచుందురు. మరికొందరు జ్ఞానయోగమును అవలంబించి ఆత్మనిష్ఠ చేయుచుందురు. మేము మాత్రము పరమ భక్తుల పాదపద్మములను ఆశ్రయించి సేవచేయుచు నుందుము.

## తామసిక భక్తి

శ్లో. యస్తు హింసా సముద్దిస్య దంభం మాత్సర్యమేవవా
భేదదృష్టిశ్చ సంరంభీ భక్తోమే తామసః స్మృతః.

తా. ఎవరు ఇతరులను బాధించుటకొరకును (ఇతరులు బాధలపాలు గావలెనను కోరికతో), ఇతరులు మెచ్చుకొనవలెనను తలంపుతోను, ఇతరులకంటె హెచ్చుగా చేయవలెనను భావముతోను, నీవు నేను యను భేదదృష్టితోను దేవుని కార్యములను పుణ్యకార్యములను, చేయుచుందురో వారు తామసభక్తు లనబడుదురు.

## రాజసిక భక్తి

శ్లో. పలాభిసంధీ భోగార్థీ ధనకామో యశ స్తథా
అర్చాదా భేదబుద్ధ్యామాం పూజాయేత్సతు రాజసః.

తా. ధనము, భూములు, ఆరోగ్యము, సంతానము, కీర్తి మొదలగునవి దయచేయుము స్వామీ, అనుచు, భేద బుద్ధిని విడువక పూజ, దానము, భజన, జపము, ధ్యానము

నమస్కారములున్ను చేయుచుండువారు రాజసిక భక్తు లనబడుదురు.

## సాత్త్విక భక్తి

శ్లో. పరస్మి న్నర్పితం యస్తు కర్మనిర్హారణాయవా
కర్తవ్య మితివా కుర్యా ద్భేదబుద్ధ్యా స సాత్త్వికః.

తా. నిష్కామముగా దైవార్పిత బుద్ధితో, జీవిత ధర్మ మను నిశ్చయముతో సత్కర్మలను జీవేశ్వర భేదముతో చేయుచుండువారు సాత్త్విక భక్తు లనబడుదురు.

శ్లో. మద్గుణాశ్రయణా దేవ మయ్యానంత గుణాలయే
అవిచ్ఛిన్నామనోవృత్తి ర్యథా గంగాంబునోఽంబుధౌ
తదేవ భక్తియోగస్య లక్షణం నిర్గుణస్యహి.

తా. గంగ సముద్రములో కలిసి నిశ్చలముగా నుండు నట్లు పరబ్రహ్మముయొక్క సత్యజ్ఞాన మనంతాది స్వరూపము నందు మనస్సు చలనము లేకుండ లయించి యుండునట్లు చేయుటయే నిర్గుణ భక్తి యగును.

నిర్గుణ భక్తిలో దేవుడు, జీవుడు, జగము యను భేద దృష్టి యుండదు.

( అధ్యాత్మరామాయణము )

## భక్తి, వైరాగ్యము

భక్తి యనగా పరమాత్మయొక్క సగుణారాధన యందుగాని, నిర్గుణారాధనయందుగాని గల ప్రేమ.

వైరాగ్య మనగా పరమాత్మ సుఖమును మరచునట్లు చేయునట్టి నామ రూప క్రియలపై విరక్తి. భక్తి, వైరాగ్యములు లేనివారికి ఆత్మజ్ఞానము కలుగదు. ఆత్మజ్ఞాన మనగా స్థూల సూక్ష్మ కారణ శరీరములకు అధిష్ఠానముగా యున్న సత్య జ్ఞాన ఆనంద స్వరూప పరమాత్మయే నేను యనెడి సుదృఢానుభవము కలుగుటయే యగును. నామరూప క్రియలు గోచరించుచున్నంత వరకును ఆత్మజ్ఞానము కలుగలేదనియే గ్రహించవలయును.

దేవునిపైని, సజ్జనులపైని భక్తి యున్నప్పుడే భార్య పుత్ర మిత్రాదులపై వైరాగ్య ముండును.

పుణ్యకర్మలపై భక్తియున్నప్పుడే పాపకర్మలపై విరక్తి యుండును.

## వైరాగ్య విభాగము
## అష్టభోగములు

శ్లో. సుగంధం వనితా విత్తం గీతం తాంబూల భోజనే
శయ్యాచ వాహనం చైవ అష్టభోగా ప్రకీర్తితాః

తా. (1) అత్తరు పన్నీరు మొదలగు వాసనల తైలములను పూసికొనుట (2) స్త్రీతో కలియుట (3) ధనముతో సంతోషించుట (4) సంగీతాది వాయిద్యములతో నుండుట (5) తాంబూలము వేసికొనుట (6) రుచిగల ఆహారములను భుజించుట (7) సుందరమైన మెత్తని శయ్యాసనములపై పరుండుట (8) ఏనుగు, గుఱ్ఱము మొదలగు వాహనములపై కూర్చొనుటయును అష్ట ఐశ్వర్యము లనబడును.

శ్లో. దాసీ భృత్యా స్సుతో బంధుః వస్తువాహన మేవచ
ధనధాన్య సమృద్ధిశ్చా ప్యష్టభోగాః ప్రకీర్తితాః.

తా. దాసీజనము, సేవకులు, బిడ్డలు, బంధువులు, నగలు మొదలగు వస్తువులు ; గుఱ్ఱము మొదలగు వాహనములు ; పుష్కలముగా ధనమును, ధాన్యమును గలిగియుండుట అష్ట భోగము లనబడును.

## పామరుల ప్రలాపములు

శ్లో. తా తేతి కించి త్తనయేతి కించి
దంభేతి కించి ద్దయి తేతి కించిత్
మమేతి కించి న్నమ మేతి కించిత్
భూతంహి సంఘుం బహుధా లపేథా.

తా. తండ్రియని కొంతసేపు, తనయులని కొంతసేపు, తల్లియని కొంతసేపు, భార్యయని కొంతసేపు, నాది యని కొంతసేపు, నాదికాదు యని కొంతసేపు—ఇట్లు ఈ మానవులు అనేకవిధములుగా పలుకుచు, తలంచుచు నుందురు.

(మార్కండేయ పురాణము)

శ్లో. పుత్రామే స న్తి ధనంమేఽ స్తి ఇతి బాలో విహన్యతే
ఆత్మాహి ఆత్మనో నా స్తి కుతః పుత్రః కుతో ధనమ్.

తా. 'నాకు పుత్రులు కలరు, నాకు ధనము గలదు' అని యిట్లు తలంచుచు అజ్ఞాని కడు దుఃఖితు డగుచున్నాడు. ఈ దేహమే తనవస్తువు కానప్పుడు పుత్రులు తనవా రెట్లగుదురు? ధనము తన దెట్లగును? (ధర్మ పదము)

శ్లో. ధనై ర్వా ధనవ్రైదైః పుత్ర దారాగార సహోదరైః
    ధ్రువం ప్రాణహరైః దుఃఖం ఇతి వేదాంత డిండిమః.

తా. ధనము, ధనమును సంపాదించే ఉపాయములు, సోదరులు పుత్రులు భార్య గృహము మొదలగునవియును ప్రాణాంతకమగు దుఃఖమునే కలిగించును అని వేదాంత భేరీ మ్రోగుచున్నది.

శ్లో. ఆశాపాశ గళే బద్ధం గృహశాఖావలంబితమ్
    పుత్ర దారా దయః శ్వానః ఖాద్యన్తేత మహర్నిశమ్.

తా. ఆశ యను త్రాటిచే కంఠమునందు కట్టబడి, గృహ మనెడి కొమ్మయందు వ్రేలాడగట్టబడి యుండు జీవుని (మానవుని) పుత్రులు, భార్య, బంధువులు అను కుక్కలు రాత్రింబవళ్లును పీకుకొని తినుచున్నవి. (శంకరులు)

## సంసారము ప్రవేశించు ద్వారములు

శ్లో. సంసార మృత్యో ర్బలినః ప్రవేష్టుం
    ద్వారాణితు త్రీణి మహాన్తి లోకే
    కాంతాచ జిహ్వా కనకంచ తాని
    ఋణద్ధియ స్తస్యభయం న మృత్యోః.

తా. మిక్కిలి బలీయమైన సంసార మనెడి మృత్యువు మూడు ద్వారముల గుండా ప్రవేశించుచున్నది. అవెవ్వి యనః స్త్రీవ్యామోహము, జిహ్వాచాపల్యము (అనగా అధికముగా రుచులకోరి భుజించే స్వభావము, అధికముగా అనవసరముగా మాట్లాడే స్వభావము వగును), ధనముపై

ఆశయును—ఈ మూటిని జయించిన వారికి మృత్యు (సంసార) భయముండదు.

## ఆశ బంధకారణ మనుట

శ్లో. యేషా మాశా నిరాశాస్యా ద్దారా పత్య ధనాదిషు
తేషాం సిధ్యతి నాన్యేషాం మోక్షాశాభిముఖేగతిః.

తా. ఎవరికి భార్యా పుత్ర ధనాదులపై ఆశ లేదో, వారికే ముక్తిమార్గము దొరుకుచున్నది గాని ఇతరులకు దొరకదు.

శ్లో. ఆశాచ నరకశ్చైవ నిరాశా ముక్తిరేవచ
ఆశా నిరాశేచ యస్యాన్య స్తస్య సుఖం భవేత్.

తా. ఆశయే నరకము. నిరాశయే మోక్ష సుఖము. ఎవడు నిరాశచే (వైరాగ్యముచే) ఆశను నశింపజేసికొనుచున్నాడో వాడే లోకములో సుఖవంతుడు.

శ్లో. క్షుత్తృధాశాః కుటుంబిన్యః మయి జీవతి నాన్యగాః
తాసా మాశా మహాసాధ్వీ కదాచిన్మాం న ముంచతి.

తా. మానవునకు ఆకలి యనెడి భార్య, ఆశ యనెడు భార్య అను ఇద్దరు భార్యలు కలరు. ఆ యిరువురిలో ఆకలి యనెడి భార్య ఆహారమును భుజించగానే తృప్తిపడి వెళ్ళిపోవును. ఆశ యనెడు భార్యయన్ననో ఉదయము నిద్ర నుండి లేచినది మొదలుకొని రాత్రి నిద్రించు వరకును (పుట్టినది మొదలుకొని మరణించు వరకును) వదలిపెట్టక పీడించుచునే యుండును. భోగములపై ప్రీతి, ధనముపై ప్రీతి, కీర్తిపై

ప్రీతి—ఇవి పామరులనే గాక వేదాంతపండితులను, సన్న్యాసులను సహితము అనేకరీతుల తిప్పలు పెట్టుచున్నవిగదా!

శ్లో. ఆశయా బధ్యతే లోకః

తా. మానవులు ఆశచేత పలువిధములుగా బంధింపబడి బాధలు పడుచున్నారు.

శ్లో. ఆశాపాశ స్థితో జీవః పాశ ముక్త స్సదాశివః

తా. మానవుడు ఆశతో నున్నంత వరకును జీవు డని పిలువబడును. వివేక వైరాగ్య భక్తి యోగములద్వారా ఆశను నశింపజేసికొనిన మహనీయుడు సాక్షాత్తుగా శివుడనబడును.

శ్లో. ఆశాయా యే దాసా స్తే దాసా సర్వలోకస్య
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః.

తా. ఆశకు ఏ మానవుడు దాసు డగునో ఆ మానవుడు లోకమున కంతకును దాసుడే యగును. ఏ మానవునకు ఆశయే లోబడి దాసీగా పనిచేయుచుండునో ఆ మానవునకు లోకములో జనులందరున్ను దాసులే యగుదురు.

## ఆశలేనివాడే ప్రకాశించును

శ్లో. న తథా భాతి పూర్ణేందు ర్నపూర్ణః క్షీరసాగరః
న లక్ష్మీవదనం కాంతం స్పృహా హీనం యథా మనః.

తా. ఆశ లేనివాని హృదయము ( మనస్సు ) ప్రకాశించునట్లు పూర్ణచంద్రుడుగాని, పాలసముద్రముగాని, లక్ష్మీ ముఖముగాని ప్రకాశింపవు.

## వైరాగ్య స్వరూపము

శ్లో. బ్రహ్మాది స్థావరాం తేషు వైరాగ్యం విషయేష్వను
యత్థైవకాకవిష్టాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్.

తా. మానవునకు కాకి మలమునందు ప్రీతిలేని విధముగా ఈ లోకము మొదలుకొని బ్రహ్మలోక పర్యంతమును గల లోకములలోని సుఖములయందు విరక్తి గలిగి యుండుట యనునదే నిర్మల వైరాగ్య మనబడును.

శ్లో. దోష దృష్టి ర్జిహాసాచ పునర్భోగేష్వ దీనతా
అసాధారణ హేత్వాద్యా వైరాగ్యస్య త్రయోప్యమీ.

తా. విషయ భోగములలో అనిత్యత్వము, దుఃఖమును గలవని మాటిమాటికిని స్మరించుచు నిరసన చేయుచుండుట దోషదృష్టి వైరాగ్య మనబడును. ఆ భోగములను వదలి వేయుట స్వరూప వైరాగ్య మనబడును. తిరిగి ఆ భోగములయందు ప్రవేశించవలెనను బుద్ధి పుట్టకుండుట కార్య వైరాగ్య మనబడును. ఈవిధముగా వైరాగ్యము త్రివిధములుగా నుండునని గ్రహించి సంపాదించుకొనవలెను.

## వైరాగ్యమెట్లు గల్గును ?

శ్లో. శ్రుతే దృష్టేఽపివా భోగ్యే యస్మిన్ కస్మింశ్చ వస్తుని
సమీచీనత్వధీత్యాగాత్ కామోనో దేతి కర్హిచిత్.

శ్లో. సంకల్పా నుదయే హేతు ర్యథా భూతార్థ దర్శనమ్
అనర్థ చింతనం చాభ్యాం నాఽవకాశోఽస్య విద్యతే.

తా. కామకాంచనాది భోగవిషయములు కంటికి కనబడినపుడు, చెవులకు వినబడినపుడు ఇవి మంచివి అనెడి భావమును కలుగనీయక చేసినచో వానిపై కోరిక, ఆసక్తి కలుగ నేరదు. కనుక అవి అశాశ్వతములనియును, దుఃఖము, గలిగించుటకు కారణములైనవి యనియును నిశ్చయించుకొని యుండవలయును.

రాగద్వేషాదిగుణముల గలిగించునట్టి నామ రూప విషయముల యొక్క నిజతత్త్వములను తెలిసికొని యుండుట, విషయములను అనుభవించుటలో గొప్ప అనర్థకము (దుఃఖము నష్టము, అపకీర్తి, పాపము) గలదని తలంచుట అను రెండు విషయములును గుర్తులో నున్న యెడల కోరికలు కలుగుటకు చోటు దొరుకదు. వైరాగ్యమునకు పతనము గలుగదు.

## వైరాగ్యముగలవారికే మంత్రోపదేశము సిద్ధి నొసగును కథ

ఒక రాజుగారి కుమారుడు ఒక గురువుదగ్గర మంత్రోప దేశమునొంది, "ఈమంత్రమును మరచి లోకవిషయములలో ఆసక్తిగలుగకుండునట్టి ఉపాయమును కూడా సెలవియ్య వలసిన" దని వేడుకొనెను. అపుడు గురువుగారు "యద్దృశ్యం తన్నశ్యమ్-అను సూత్రమును దృష్టిలో నుంచుకొనుము. అపుడు నేను చెప్పిన భగవన్మంత్రమును మరువకయుండ గలుగుదు"వని చెప్పెను. అప్పటినుండి రాజకుమారుడు కంటికి కనబడువానిని, చెవులకు వినబడువానిని, ముక్కుకు వేసిన వాసనలను, జిహ్వకు తెలియుచున్న రుచులను, చర్మము

వను తెలియుచున్న శీతోష్ణ మృదు కఠిన స్పర్శలను గ్రహించు చున్నపుడు 'ఇవి నశించిపోవునవే గదా' యని తలంచి మంత్ర జపముతో కాలము గడుపుచుండెడివాడు.

కొంతకాలమైన తరువాత తల్లిదండ్రులు కుమారునకు మహావైభవముగా వివాహము చేయుచుండగా "ఈ అలంకారములు నశించిపోవునవేగదా, ఈ నా సుందరమైన భార్య ఎప్పటికైన నశించిపోవునదేగదా, ఈ కవివరులు చేయు స్తోత్రములు అనిత్యమైనవేగదా, ఈ మేడలును, మిద్దెలును, ధనధాన్యములును, రాజ్యాధిపత్యమును నశించిపోవునవేగదా" యని నిశ్చయించుకొని గురువు చెప్పిన మంత్రమును మరువక దైవానందములో నుండెనేగాని దృశ్యానందములోనికి దిగిరాలేదు. ఈ చింతనతో నుండగా వివాహ కార్యక్రమమంతయు ముగిసినది. తరువాత కొంత కాలమునకు అతడు సర్వమును త్యాగము చేసి జీవన్ముక్తి పదము నొందెను.

ఈ కథవలన వైరాగ్యము గలవారికే మంత్రోపదేశమును, వేదాంతశ్రవణమును ప్రయోజనకారి యగునని తెలియుచున్నదిగదా!

వైరాగ్యము లేనిచో భక్తి నిలువదు. భక్తిలేనిచో వైరాగ్యమున్ను నిలువదు.

## వైరాగ్యము లేనివారికే యమబాధ

శ్లో. వైరాగ్య రహితా ఏవ యమాలయ ఇవాఽలయే
క్లిశ్యంతి త్రివిధైస్తాపైః మోహితా అపి పండితాః

తా. వైరాగ్యములేని మనుజులు పండితులైనప్పటికిని మోహాగ్రస్తులే యగుచు యమలోకమందు బాధనొందునట్లు, గృహమందే రోగములచే, మానసిక సంబంధమైన చింతలు క్రోధము భయములచే, తేలు, పాములు, దొంగలు విరోధులచే (తాపత్రయముచే) బాధలు పడుచున్నారు.

## వైరాగ్యమే భయములేనిది

శ్లో. భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే
నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం,
కాయే కృతాంతాద్భయం
సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం
వైరాగ్యమేవాఽభయమ్.

తా. విషయభోగములను అనుభవించుచుండునప్పుడు రోగములు వచ్చునేమో యను భయ ముండును. మంచి కులములో (వంశములో) పుట్టియున్నపుడు కులభ్రష్టత్వము (వంశమునకు అపకీర్తి) కలుగునేమో యను భయ ముండును. ధనధాన్యములున్నపుడు రాజుగాని, దొంగలు గాని తీసికొనిపోవుదురేమో యను భయముండును. మనస్సు సంతోషముతో ధైర్యముగా, ఉత్సాహాముగా, నిశ్చింతగా యున్నపుడు దుఃఖము, పిరికితనము, నిరుత్సాహము, దిగులు పుట్టునేమో యను భయ ముండును. శరీరబలము, మంది

బలమును ఉన్నపుడు శత్రువులు బాధింతురేమో యను భయ ముండును. శరీరం చక్కగా అందముగా యున్నపుడు ముసలితనము వచ్చి ముడుతలు పడి సౌందర్యకాంతులు పోవునేమో యను భయముండును. పాండిత్యమున్నపుడు ఇతరులు వచ్చి వాదములు చేసి బాధ గలిగింతురేమో యను భయము కలుగును. సద్గుణములు, సత్ప్రవర్తనలు గలిగి విరాజిల్లుచున్నపుడు దుర్మార్గులు వచ్చి చెడగొట్టుదురేమో, హేళన చేయుదురేమో యను భయ ముండును. శరీరము సుఖముగా జీవించుచున్నపుడు మరణమువచ్చునేమో యను భీతియుండును. ఈవిధముగా సర్వవ్యామోహములును, మమకారములును కోరికలును భయముతోనే, దుఃఖముతోనే కూడి యున్నవి. ఇక వైరాగ్యమొక్కటే భయము లేనిది, దుఃఖము లేనిది, ఆనందకరమైనది.

## వైరాగ్య చక్రవర్తి కేయాపదా లేదు

శ్లో. పతతు నభః స్ఫుటతు మహీండయంతు
గిరయోమిళంతు వారిధయః
అధరోత్తరమస్తు జగత్ కా హానిః వీతరాగస్య.

తా. ఆకసము పెళపెళమని పైనపడుగాక, భూమి పటపట మని పగులుగాక, పర్వతములు పటాటోపముతో రివ్వున యెగురుగాక, సముద్రములు పొంగి పొరలి కలియుగాక, ఈ జగత్తంతయు తలక్రిందగుగాక, అయినను నిస్సంగుడగు వైరాగ్యవంతుడు ఏ హానియును తలంచడు.

## వైరాగ్యముయొక్క దివ్యఫలితము

శ్లో. "వైరాగ్యస్య ఫలం బోధః"

తా. వైరాగ్యముయొక్క మహత్ఫలము ఆత్మ జ్ఞానము కలుగుటయే యగును.

శ్లో. వైరాగ్యం పుష్కలం నస్యా నిష్ఫలం బ్రహ్మదర్శనమ్
తస్మాద్రక్షేత విరతి బుధో యత్నేన సర్వదా.

తా. వైరాగ్యము పూర్ణముగా లేనివారికి పరబ్రహ్మ సాక్షాత్కారానుభవము కలుగదు. అందువలన వివేకము గలవారు ఎల్లప్పుడును వైరాగ్యమును చెడనీయక కాపాడు కొనుచుండవలయును.

శ్లో. సర్వత్యాగో మహారాజన్ సర్వసంపత్సమాశ్రయమ్
న గృహ్ణాతి హియత్కించి త్సర్వం తస్మై ప్రదీపితే.

తా. మహారాజా! సర్వసంగపరిత్యాగము చేసిన మహానుభావుని సర్వసంపదలున్ను చక్కగా ఆశ్రయించి యుండును (సేవచేయుచుండును). ఇతరము నేమియు కోరని విరాగికే సర్వమును యివ్వబడుచుండును. (అనగా కోరిక లేనివారికే అందరున్ను యిచ్చుచుందురు. ఆశగలవారి కెవ్వరున్ను ఇవ్వరు.)

శ్లో. సర్వవస్తు నసంత్యక్తం తావ దాత్మా నలభ్యతే
సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే.

తా. సమస్తవస్తువులను (భ్రాంతులను) వదలిపెట్ట నంతవరకును ఆత్మస్వరూప జ్ఞానము కలుగదు. సర్వకోరిక

లను వదలివేయగా మిగిలిన వస్తువు ఆత్మస్వరూపమే యని చెప్పబడును.

శ్లో. ముక్తిం దదాతి వైరాగ్యం రాగోయచ్ఛతి బంధతామ్
మతంవై సర్వశాస్త్రాణి యథేచ్ఛసి తథా కురు.

తా. "వైరాగ్యము మోక్షసుఖము నిచ్చును. రాగము (కోరికలు) బంధము (దుఃఖము) కలిగించును. ఇదియే అన్ని వేదాంతశాస్త్రముల నిశ్చయము. ఇక నీ యిష్టమెట్లున్నదో యట్లు నడచుకొనుము" అని జనకమహారాజునకు అష్టావక్రమహర్షి చెప్పెను.

శ్లో. విరక్తిహీనస్యకుతః ప్రబోధః విరక్తిహీనస్యకుతః ప్రయోగః
విరక్తిహీనస్య కుతశ్చమోక్షః తస్మాద్విరక్తస్య
సమస్తలాభః.

తా. వైరాగ్యము లేనివారికి వేదాంతబోధ లెందుకు? వైరాగ్యము లేనివారికి గృహత్యాగము, ఏకాంతవాసము మొదలగు ప్రయోగములవలన లాభమేముండును? వైరాగ్యము లేనివారికి మోక్షమెట్లు కలుగును? కనుక ఒక్క వైరాగ్యములోనే సర్వలాభములున్ను కలవని తెలిసికొని ప్రవర్తించవలయును.

## భోగ్యపదార్థాలు మేకులు

యావతః కురుతే జంతుః
సంబంధా న్మనసః ప్రియాన్
తావంతోస్య నిఖన్యంతే
హృదయే శోక శంకవః.

తా. జనుడు తన మనస్సునకు భోగ్యపదార్థాలతో ఎన్ని సంబంధాలు పెట్టుకుంటాడో, శోకా లనే అన్ని మేకులు అతని హృదయంలో నాటుకొంటాయి.

—విష్ణుపురాణం

## విజయసాధన

నువ్వు యితరులకు ఇచ్చే ఉపదేశం ప్రకారం నడచుకోవడమే నీ జీవితంలో విజయం సాధించడానికి ఉత్తమ మార్గం.

—రిచెర్

శ్లో. కామాశాం వహతః పుంసః సుఖం నాస్తి జగత్రయే
కామాశాం త్యజతః పుంసః సర్వత్ర సుఖమేధత.

తా. ఆశలుగల మానవులకు మూడులోకములందును సుఖములేదు. ఆశలను వదలిన ( నశింపజేసికొనిన ) మానవులకు అన్నికాలములందును, అన్ని స్థలములందును సుఖము కలుగుచుండును.

శ్లో. శాంతే సముద్రకల్లోలే స్నాన మిచ్ఛతి మూఢధీః
తథైవ శాంత సంసారే జ్ఞాన మిచ్ఛతి దుర్మతిః.

తా. సముద్రములోగల అలలు శాంతించిన తరువాత స్నానము చేయవచ్చునని తెలివితక్కువ మానవులు తలంచుచుందురు. ఇట్లే సంసారములో కోరికలనన్నిటిని నెరవేర్చుకొనినతరువాత జ్ఞాన ( మోక్ష ) సుఖప్రాప్తికి పాటుపడవచ్చునులే యని అజ్ఞులైన ( విచారణచేయని ) మానవులు యిచ్ఛగించుచుందురు.

## ఆహా! మేమెంతో సుఖముగ జీవించుచున్నాము

శ్లో. సుసుఖంవత జీవామో వైరిష్వ వైరిణః
వైరిషు మనుష్యేషు విహరామోఽవైరిణః.

తా. శత్రువులయందుకూడ మిత్రభావము కలిగి యుండవలయును. ఆహా! మేమెంతయో సుఖముగా(హాయిగా) జీవితమును గడుపుచున్నాము. వైరులమధ్య వైరము లేకుండ జీవించుచున్నాము.

శ్లో. సుసుఖంవత జీవామ ఆతురేష్వనాతురాః
ఆతురేషు మనుష్యేషు విహరామోఽనాతురాః.

తా. భయము కలిగించువారి మధ్య నిర్భయముగా నుండవలయును. ఆహా! మా జీవితమెంత సుఖప్రదమైనది! భయభీతులగువారి మధ్య నిర్భయులమై మేము సంచరించుచున్నాము.

శ్లో. సుసుఖంవత జీవామ ఉత్సుకేష్వనుత్సుకాః
ఉత్సుకేషు మనుష్యేషు విహరామ అనుత్సుకాః.

తా. ఆసక్తులమధ్య (కామమోహ మమకారములతో నున్నవారిమధ్య) అనాసక్తులై (వైరాగ్యవంతులై) యుండవలయును. ఆహా! మే మెంతయో సుఖముగ జీవితమును గడుపుచున్నాము. ఆసక్తుల మధ్య అనాసక్తులమై మేము ప్రవర్తించుచున్నాము.

శ్లో. సుసుఖంవత జీవామో యేషాం నో నాస్తి కించన
ప్రీతి భక్ష్యాభవిష్యామో దేవా ఆభాస్వరాయథా.

తా. మావద్ద యే వస్తువున్న లేదు. ఆహా! మేమెంత సుఖముగ జీవితమును గడుపుచున్నాము! ఆ భాస్వర దేవతలవలె మేము సుఖమునే భక్షించుచున్నాము.

శ్లో. "అమృతస్యాత్ నిరాశా."

తా. దేనియందును ఆశలేకుండుటయే అమృత మనబడును.

## అజ్ఞానమున్నంతవరకు, జ్ఞానం కలుగువరకు మనకు సౌఖ్యము కలుగదు

శ్లో. యావన్నాదిగతం జ్ఞేయం యావత్ క్షీణా నచిత్తభ్రూః
యావత్తీర్ణో న సంసార స్తావన్నః కుశలం కుతః.

తా. ఎంతవరకు బ్రహ్మస్వరూపము తెలియబడలేదో, ఎంతవరకు చిత్తచాంచల్యము నశించలేదో, ఎంతవరకు సంసారవ్యామోహామును దాటలేదో అంతవరకును మనకు సౌఖ్యమెక్కడిది?

శ్లో. ఆశాయావదశేషేణ నలూనా శ్చిత్తసంభవాః
వీరుధోదాత్త్రికేణేవ తావన్నః కుశలం కుతః.

తా. గొడ్డలిచేత పొదలు ఛేదింపబడునట్లు ఎంతవరకు చిత్తమున కలిగిన ఆశలు నిశ్శేషముగా నశింపజేయబడ లేదో, అంతవరకును మనకు సుఖమెక్కడిది?

శ్లో. యావన్నాధిగతం జ్ఞానం యావన్నసమతోదితా
యావన్నాభ్యుదితో బోధ స్తావన్నః కుశలం కుతః.

తా. ఎంతవరకు పెద్దలద్వారా జ్ఞానవిషయములను తెలిసికొనలేదో, ఎంతవరకు సమత్వభావన కలుగలేదో, ఎంతవరకు "అహంబ్రహ్మాస్మి" నేను సాక్షాత్తుగాపరబ్రహ్మాయే యను దృఢానుభవముగలుగలేదో, అంతవరకున్ను మన జీవితమునకు క్షేమమెక్కడిది?

శ్లో. ఏతావ త్తైవ దేవేశః పరమాత్మావగమ్యతే
కాష్ఠలోష్టసమత్వేన దేహోయదవలోక్యతే.

తా. దేహమును కొయ్యతోను, మట్టిగడ్డతోను సమముగా చూడబడినంతమాత్రముచేతనే సర్వదేవాధిపతియగు పరమాత్మ తెలిసికొనబడుచున్నది.

శ్లో. న ధనాని న మిత్రాణి న శాస్త్రాణి న బాంధవాః
న రాణా ముపకుర్వంతి మగ్నస్యాత్మసముద్ధృతౌ.

తా. సంసార దుఃఖములో మునిగియున్న జీవాత్మను ధనము మిత్రులు శాస్త్రములు బంధువులున్ను ఉద్ధరించలేరు. సహాయపడలేరు. ఎవరికివారే విశ్వాసబలంతో తరించవలెను.

## సంసారభయమననేమి?

శ్లో. రోగాద్భీతిః మృతేర్భీతిః ద్వంద్వాద్భీతిః నృపాదపి
చోరాత్ క్షామాత్ రిపోర్భీతిః భవోభయ మయస్సదా,

తా. రోగములవలన భయము, మరణ భయము, రాగద్వేష దుఃఖనిందాది ద్వంద్వములు వచ్చుట వలన

భయము, రాజు దండించునేమో, ధనమును తీసికొని పోవునేమో యను భయము. దొంగల భయము, కరువు వచ్చునేమో యను భయము. శత్రువుల వలన భయము మొదలగు భయములు సంసారభయము లనబడును.

## సంసారమననేమి?

శ్లో. తస్యహృత్కంఠనేత్రేషు ప్రచారవశతోఽభవేత్
సుప్తిః స్వప్నో జాగరశ్చ సోయం సంసార ఈరితః.

తా. మనస్సు హృదయమందు చేరియున్నపుడు సుషుప్తి కలుగుచున్నది. మనస్సు కంఠము నందున్నపుడు స్వప్నావస్థ కలుగును. మనస్సు నేత్రములందు చరించు నపుడు జాగ్రదావస్థ కలుగుచున్నది. ఈ త్రివిధావస్థలే సంసార మనబడుచున్నది.

(అనుభూతి ప్రకాశము)

## న్యాయాన్యాయ ఫలితములు

శ్లో. యాంతిన్యాయ ప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాన్
అపంథానంతు గచ్ఛాంతం సోదరోపి విముంచతి.

తా. న్యాయమార్గమున ప్రవర్తించుచుండు వారికి పశుపక్ష్యాదులుకూడ సహాయముగా నుండును. అన్యాయ మార్గమున వర్తించుచున్న వారిని సోదరులుకూడ వదలి వేయుదురు.

ఫుడ్, హెడ్, గాడ్

తా. ఆహారము, వివేక జ్ఞానము, దైవచింతనయు మానవునకు వుండదగినవి యని శ్రీ వివేకానందస్వామి చెప్పెను.

## మానసిక శారీరక రోగములు

శ్లో. మానసాః పుత్రమిత్రాది వియోగాది భవామతాః
వైహికా క్షుత్పిపాసాద్యా జ్వరాద్యా పరితాపినః.

తా. పుత్రులు, మిత్రులు, ధనము, భూములు, ఇండ్లు మొదలైనవి పోయినపుడు గలిగిన భయము, చింత దుఃఖములు మానసిక రోగము లనబడును. ఆకలి, దప్పిక, జ్వరము తలనొప్పి, కడుపునొప్పి, మున్నగువానిచే గలుగు బాధలు శారీరక రోగము లనబడును.

శ్లో. పూర్వజన్మకృతంపాపం వ్యాధిరూపేణ బాధితైః
తచ్ఛాంతిరౌషదందానం జపహోమ సురార్చనైః.

తా. పూర్వజన్మమున చేసిన పాపకర్మల దోషముల వలన మానసిక బాధలు, శారీరక బాధలున్ను కలుగు చుండును. కనుక ఆ బాధలను శరీరముతో, వాక్కుతో, మనస్సుతోను దైవపూజ, దానము, భగవన్నామ సంకీర్తన, సేవ, జపము, ధ్యానములను చేయుచు శాంతింపజేసికొను చుండవలెను.

## ఇహపర సుఖ సాధనలు

శ్లో. జలసేవా న్నసేవాచ సేవాచై వౌషధస్యచ
సాధుసేవా విష్ణుసేవా సేవాధర్మపథస్యచ.

తా. జలమును త్రాగుట, అన్నము భుజించుట, ఔషధమును సేవించుటయు ఇహలోక సుఖ సాధనములగును. సాధు గురు జన సేవచేయుట, శివ కేశవులను భజించుట, అహింస, సత్యము, బ్రహ్మచర్యము, దొంగిలించకుండుట, ఇతరులను యాచించకుండుట, మొదలగు ధర్మములను ఆచరించుట పరమాత్మ సుఖప్రాప్తికి సాధనములు.

## ప్రకృతి యననేమి ?

శ్లో. ప్రకృష్టవాచకఃప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః
సృష్టౌ ప్రకృష్టాయా దేవి ప్రకృతిస్సాప్రకీర్తితా.

తా. ప్ర యనగా శ్రేష్ఠము. కృతి అనగా సృష్టి. ఏ దేవి సృష్టిచేయుట యందు శ్రేష్ఠురాలో ఆ తల్లియే ప్రకృతి యనబడును.

## అవిద్య యననేమి ?

సూ. అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి
సుఖాత్మఖ్యాతిరవిద్యా

తా. అనిత్యములగు స్వర్గాదిభోగములయందు నిత్యములైనవను బుద్ధి. అశుచికరములైన మాంసరక్త దుర్గంధ మల మూత్రాదులతో గూడిన దేహములందు శుచిత్వము

## ఇహపర సుఖ సాధనలు

శ్లో. జలసేవా న్నసేవాచ సేవాచై వౌషధస్యచ
సాధుసేవా విష్ణుసేవా సేవాధర్మపథస్యచ.

తా. జలమును త్రాగుట, అన్నము భుజించుట, ఔషధమును సేవించుటయు ఇహలోక సుఖ సాధనములగును. సాధు గురు జన సేవచేయుట, శివ కేశవులను భజించుట, అహింస, సత్యము, బ్రహ్మచర్యము, దొంగిలించకుండుట, ఇతరులను యాచించకుండుట, మొదలగు ధర్మములను ఆచరించుట పరమాత్మ సుఖప్రాప్తికి సాధనములు.

## ప్రకృతి యననేమి ?

శ్లో. ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః
సృష్టౌ ప్రకృష్టాయా దేవి ప్రకృతిస్సాప్రకీర్తితా.

తా. ప్ర యనగా శ్రేష్ఠము. కృతి అనగా సృష్టి. ఏ దేవి సృష్టిచేయుట యందు శ్రేష్ఠురాలో ఆ తల్లియే ప్రకృతి యనబడును.

## అవిద్య యననేమి ?

సూ. అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి
సుఖాత్మఖ్యాతిరవిద్యా

తా. అనిత్యములగు స్వర్గాదిభోగములయందు నిత్యములైనవను బుద్ధి. అశుచికరములైన మాంసరక్త దుర్గంధ మల మూత్రాదులతో గూడిన దేహములందు శుచిత్వము



గలదను నిశ్చయము, దుఃఖకరములగు పుష్పములు, సుగంధ ద్రవ్యములు, కామ భోగములు మున్నగు వానియందు సుఖము గలదను విపరీతబుద్ధియు, అనాత్మపదార్థము లగు దేహేంద్రియములందు అవే నేననెడి ఆత్మబుద్ధియును అవిద్య యనబడును.

యాత దభిమానం కారయతి
సాహ్యావిద్యా

తా. ఏది అభిమానమును కలిగించుచుండునో అది అవిద్య యగును.

## మాయ యననేమి ?

శ్లో. అవిద్యా సంసృతిర్మోహో బంధోమాయామలంతమః
కల్పితానీతినామాని తస్యాస్సకలవేదిభిః.

తా. ఒక్క మాయకు పెద్దలు అవిద్యయని, సంసారమని, మోహమని, బంధమని మాయ యని, మలమని (అనగా పాపమని) తమస్సనియు పేరులు పెట్టిరి.

అనాత్మమూలం మాయా.

తా. ఆత్మను మరుగుపరచి దేహమే నేను యను అనాత్మ భ్రమలో ముంచుటకు కారణమైనది మాయ యగును.

## మాయ చేయు పనులు

శ్లో. పశ్యన్నపి ప్రస్ఖలతి శృణ్వన్నపి న బుధ్యతి
పఠన్నపి నజానాతి దేవమాయావిమోహితః

తా. దేవుని మాయచేత మిక్కిలి మోహము నొందిన మానవులు, మంచి చెడు మార్గములను చూచియు, చెడు మార్గముననే నడచెదరు. మంచి చెడ్డలను, నిత్యానిత్యములను వినుచుండియు గ్రహించలేరు. చదువుచుండియు మోక్షమార్గమును తెలిసికొనలేరు.

సీ. ఉన్నది లేదని యూహింపగా నేర్చు
లేనిది కలదని లెస్స నేర్చు
అజడంబు జడమని యాగడింపగ నేర్చు
జడమజడంబని చాట నేర్చు
సుఖము దుఃఖంబుగా జూపి చెప్పగ నేర్చు
దుఃఖంబు సుఖమన దొలుత నేర్చు
నిది నిదిగాదని యింపుగా నన నేర్చు
నదియిదిగాదని యనగ నేర్చు

తే. బిదపగలదియు గలదు లేనిదియు లేదు
కడగి యజడంబె యజడము జడమె జడము
సుఖమె సుఖము తలంప నసుఖమె యసుఖ
మదియె యిది యిది యది యని యాడ నేర్చు.

## మాయను దాటే ఉపాయములు

శ్లో. అవిద్యా రూపరహితా యావదేవావలోక్యతే
తావదేవగలత్యాసు తుహినావార్యథాగపే.

తా. అవిద్య కంటికి కనబడదు. కామక్రోధాది గుణముల రూపముగా ఆత్మకు గోచరించుచుండును. ఆత్మా

నాత్మ విచారణతో అవిద్యను వాని కార్యములను చూచు చున్న యెడల సూర్యుని వేడి కిరణములకు మంచు తుంపురులు నశించుచుండునట్లు ( అవిద్య ) నశించుచుండును.

శ్లో. దైవీహ్యేషాగుణమయీ మమమాయాదురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.

తా. మాయారూపములైన సత్త్వ, రజస్తమో గుణములను దాటుట మహాకష్టమైన పని. అయినప్పటికిన్ని భగవంతుని నమ్మి నిరంతరమును సంకీర్తన, జపము, ధ్యాన ములను చేయుచున్నచో మాయను దాటవచ్చును.

తే. ప్రేమమీరంగ శ్రీరామ రామ
యనుచు సతతంబు మత్స్వరూపానుభవము
జేయువారల దక్క నీ సీతమిగుల
నెట్టివారలఁ జిక్కులఁబెట్టు నసఘ.

## భక్తుల బాధలు - దేవుడు

ప్రశ్న : దేవుడు కూడ భక్తుల నిమిత్తము కష్టము లను అనుభవించునా ?

సమా : ప్రహ్లాదునికి తన తండ్రి పెట్టించిన బాధల నన్నిటిని శ్రీహరియే అనుభవించెను.

కథ : కుబేరుని కొడుకులగు నలకూబరుడు, మణి గ్రీవుడును నారద మహర్షి శాపమువలన మద్దిచెట్లు అయిరి. చాలాకాలమైన తరువాత తల్లియగు యశోదచే రోటికి బంధింపబడిన శ్రీ బాలకృష్ణుడు మద్దిచెట్లమధ్యనుండి రోటిని

ఈడ్చుకొని పోవుచు మద్దిచెట్లను పడగొట్టెను. అప్పుడే కుబేరుని కొడుకుల శాపబంధము తెగిపోయెను.

కథ : శ్రీకృష్ణ భగవానుడు తన భక్తుడగు అర్జునుని నిమిత్తము రథసారథిగానుండి భీష్మాచార్యులు వేసిన బాణములచే బాధపడెను.

కథ : అత్తగారిచే బంధింపబడిన సతీసక్కుబాయి బంధములో శ్రీ పాండురంగడు బంధింపబడి, తన భక్తురాలైన సక్కుబాయిని పండరీక్షేత్రమునకు పంపెను.

కథ : మహమ్మదీయుడును, పాండురంగభక్తుడు నగు తాజుద్దీన్ బాబాగారు నిర్యాణము నొందినపుడు నాగపూర్ సమీపమున చక్రధర దేవాలయ మందలి శ్రీ పాండురంగ స్వామి రుక్మిణీదేవి మూర్తులనుండి (కన్నులనుండి) పండ్రెండు గంటలు నీరు ప్రవహించెను—అని టైమ్సు ఆఫ్ ఇండియా అను పత్రిక (ది. 17-8-1925) లో ప్రకటించెను. ఈ విషయము గుంటూరు శ్రీరామనామ క్షేత్రమువారి శ్రీరామ పూజ అను గ్రంథములో గలదు.

కథ : నారాయణప్రసాద్ నిరంతరమును జగన్నాథుని పూజించుచు తనకు అనన్యదైవభక్తి నిమ్మని ప్రార్థించుచుండెడివాడు. తన తల్లి మరణించిన తరువాత అతడు పూరీ జగన్నాథ క్షేత్రమునకు వెళ్ళి సముద్రతీరమున కూర్చొని పరమభక్తితో భజనచేయుచు నుండెను. ఆహారము లేక యుండుట వలన మూడవ రోజున జగన్నాథుడు లక్ష్మీదేవితో ఆహారమును తీసికొని వెళ్లి మన భక్తునకు పెట్టిరమ్మని చెప్పగా లక్ష్మీదేవి బంగారపు పళ్లెరములతో ఆహారమును తీసికొని వెళ్లి

భజనలో తన్మయుడై యున్న నారాయణ ప్రసాదు దగ్గర పెట్టి వెళ్లెను. తరువాత కొంతసేపటికి కండ్లు తెరచి చూడగా ఆహారము కనబడుటవలన భుజించి భక్తుడు నిద్రించెను.

పూజారులు దేవాలయమునకు వచ్చి చూడగా కనకపు పళ్లెరములు కనబడలేదు. ఆశ్చర్యముతో భయముతోను దొంగలు దొంగిలించి యుందురని తలంచి రాజుగారికి తెలిపిరి. వెంటనే రాజు దొంగలను వెదకుటకు భటులను పంపెను. వారు సముద్రపు ఒడ్డున కూర్చొనియున్న నారాయణ ప్రసాదు దగ్గరకు వెళ్లగా బంగారపు పళ్ళెములు కనుపించెను. వెంటనే దొంగ దొరికెనని పట్టుకొని రాజుగారి దగ్గరకు తీసికొని పోయిరి. నేను తీసికొని రాలేదని భక్తుడు చెప్పుచున్నప్పటికి రాజుగారు కఱ్ఱతో అరగంటసేపు కొట్టెను. నారాయణ ప్రసాదు దైవస్మరణలో నున్నవాడై బాధపడక తిరిగి సముద్రతీరమునకు వెళ్లి కూర్చొని భజన చేయుచుండెను.

ఆ రాత్రి రాజుగారికి నిద్ర పట్టలేదు. దేవుని నడుమునుండి రక్తము వచ్చుచున్నట్లు కలలో కనబడెను. వెంటనే లేచి పూజారులవెంట నిడుకొని దేవాలయములోనికి పోయి చూడగా దేవుని నడుమునుండి రక్తము కారుచుండుట చూచి భయపడినవారై అపరాధము చేసితిమని నిశ్చయించుకొని పేద భక్తుడగు నారాయణ ప్రసాదు దగ్గరకువెళ్ళి పాదములపై బడి దేవాలయమునకు తీసికొని వచ్చిరి. అపుడు నారాయణ ప్రసాదు దేవునిచూచి ఏడ్చుచు "తండ్రీ! ఆపద్బాంధవా, భక్తరక్షణ కంకణధారీ, దీనజన పోషకా,

దీనుడవగు నన్ను గురించి నీవెంత కష్టపడితివి! ఎవ్వరిపైని క్రోధము చూపక ఎప్పటివలె నీ రూపము కనబడును గాక'' యని ప్రార్థించెను.

## భగవంతుడు భక్తులకు భోజనము పెట్టించునా?

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

తా. భగవంతుడనగు నన్ను ఎల్లప్పుడును నమ్మి, సేవించుచున్న యెడల, లేని సుఖముల నిచ్చెదను, ఉన్న సుఖములను చెడనీయక కాపాడు చుందును అని భగవంతుడు చెప్పెను.

కథ : శ్రీ బుద్ధ భగవానుడు తపస్సు చేయుచున్న రోజులలో ఏనుగు చెరకు గడను తీసికొని వచ్చినది. కోతి తేనెతెట్టెను తీసికొని వచ్చి యిచ్చినది. పాము పడగ విప్పి వర్షము పడనీయక కాపాడినది.

కథ : విశుద్ధానందభారతీ స్వాములవారు తీర్థయాత్ర చేయుచున్న రోజులలో ఒక అరణ్యములో నడచుచుండగా ఒక కోతి పండ్లు తీసికొనివచ్చి యిచ్చెను. అపుడా మహాత్ముడు భగవంతుడు భక్తులను కాపాడుచుండుట సహజమేగదా యని ప్రార్థనచేసి కొన్ని పండ్లు తాను తీసికొని తక్కిన పండ్లను వానరమునకు యిచ్చి నమస్కరించెను.

కథ : శ్రీ వివేకానందస్వాములవారు ఆకలితో రైలులో వచ్చుచుండగా భోజనముచేసి నిద్రించుచున్న

హరిజనభక్తుని కలలో శ్రీరాముడు వివేకానందుని రూపమును చూపి ఆయనకు ఫలహారములను తీసికొని వెళ్లి ఇమ్ము అని చెప్పెను. అపుడా భక్తుడు దిగ్గున లేచి ఫలహారములను తీసికొని రైలుస్టేషనునకు వెళ్లి, కూర్చొని స్వామిరాగానే సమర్పించుకొని జరిగిన విషయమును విన్నవించుకొనెను. అపుడు వివేకానందస్వామి భక్తులపై భగవంతునకు గల వాత్సల్యమునకు మిక్కిలి సంతోషముతో తన్మయత్వము నొందెను. తరువాత ఫలహారమును స్వీకరించెను.

కథ : శ్రీ మహర్షి మలయాళ సద్గురు స్వాములవారు తిరుపతి కొండపైన తపస్సు చేయుచున్న రోజులలో భక్త వత్సలుడగు శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీమలయాళ స్వాముల వారికి భోజనము పెట్టవలసినదని మహంతుగారికి చెప్పెను. అపుడు మలయాళ స్వాములవారికి భోజన వసతి నేర్పాటు చేసెను.

## ధర్మవిశేషములు

శ్లో. రోగశోక పరీతాప బంధన వ్యసనానిచ
ఆత్మాపరాధ వృక్షాణాం ఫలాన్యేతాని దేహినామ్.

తా. రోగములు, దుఃఖములు, పరితాపములు, వ్యసనములున్ను, జీవుడు స్వయముగా చేసికొనిన అపరాధము (పాపము) యనెడి వృక్షముయొక్క ఫలములనబడును. కనుక సుఖపడదలంచువారు తప్పు పనులను చేయకుండవలెను.

శ్లో. మైత్రింకురు సుఖార్యేషు దుఃఖితేషు దయాంకురు
పుణ్యాత్మత్సుచ సంతోషం ఔదాసీన్యం కుబుద్ధిషు.

తా. సుఖముగాయున్న వారితో స్నేహము చేయుము. దుఃఖములతోనున్న వారిపై దయగలిగి యుండుము. పుణ్యకర్మలను చేయువారిని (సత్ప్రవర్తనలు గల వారిని) చూచి సంతోషించు చుండుము. పాపాత్ములయెడ సాక్షిగా నుండుము. ఈ చెప్పబడినట్లు వర్తించుచుండు వారు సుఖముగా నుండగల్గుదురు.

శ్లో. గర్భే వ్యాధౌ శ్మశానేచ పురాణేయా మతిర్భవేత్
సా యది స్థిరతాం యాతి కో నముచ్యేత బంధనాత్.

తా. గర్భములోనున్నప్పుడున్న ధర్మాధర్మ వివేక జ్ఞానము, వ్యాధి గల్గినపుడు, శ్మశాన మందున్నప్పుడు యున్న వైరాగ్య గుణము, గీత, శాస్త్రము పురాణములను వినినప్పుడున్న బ్రహ్మ సత్యము జగత్తు (సంసారము) మిథ్య యనెడి నిశ్చయమును, ఎల్లప్పుడును సుస్థిరముగా యున్న యెడల ఎవరి బంధము తెగక యుండును? అనగా ముక్తులగుదురని తాత్పర్యము.

శ్లో. జిహ్వాదగ్ధాపరాన్నేన హస్తౌ దగ్ధౌ పరిగ్రహాత్
మనోదగ్ధం పరస్త్రీభిః కార్యసిద్ధిః కథంభవేత్

తా. పరుల అన్నమును భుజించుటవలన జిహ్వేంద్రియములో (వాక్కులో) గల పుణ్యశక్తి నశించును. పరుల ధనాది వస్తువులను తీసికొనుట వలన హస్తములలో గల సుకృత బలము నశించును. వ్యభిచారచింతనలు చేయు

-చుండుట వలన మనస్సులో గల పవిత్రత ( మనశ్శుద్ధి ) నశించును. అందువలన తలంచిన కోరిక నెరవేరదు, అన్న మాట చెల్లదు, ప్రారంభించిన కార్యము (పని) కొనసాగదు. కనుక భక్తులు ముముక్షువులున్ను మనోవాక్కాయములను ( త్రికరణములను) పరిశుద్ధముగా నుంచుకొనవలెను.

ధర్మో మద్భక్తికృత్ ప్రోక్తో జ్ఞానం చైకాత్మ్యదర్శనమ్

తా. భగవంతుడనగు నన్ను భక్తితో సేవించుచుండుట ( స్మరించుచుండుట ) యే ధర్మమనబడును. ఆత్మదర్శనము జ్ఞానమనబడును. (అని ఉద్ధవునకు భగవానుడు చెప్పెను )

## జీవితము

జీవితం ఒక బరువు. దానిని మోయడానికి వెనుదీయకు. జీవితం ఒక కర్తవ్యం. దానిని నిర్వర్తించడానికి సంశయించకు. జీవితం ఒక ముళ్ళ కిరీటం. దానిని ధరించడానికి సంకోచించకు.

పెరీరా

## నా ఆకాంక్ష

అపాయాలనుంచి రక్షించవలసినదని నేను అర్థించను. వాటిని ఎదుర్కొనగల ధైర్యం నాకు కలగాలని మాత్రమే నేను కోరుకొంటున్నాను. నా బాధను ఉపశమింప జేయవలసినదని నేను వేడుకోను. దానిని భరించగల హృదయం నాకు వుండాలని మాత్రమే నా ఆకాంక్ష.

రవీంద్రనాథ టాగోర్

## మాలవా రెవరు ?

భార్యపై ప్రేమ నుంచుకొని, తల్లిదండ్రులకు బాధ గలుగునట్లు కఠినముగాను, క్రోధముతోను పలుకువాడు మాలవా డనబడును.

పిల్లలను కని ముసలితనములో భర్తను ద్వేషించే భార్య మాలది యనబడును.

పెంచి పెద్ద జేసిన వారిని మోసగించు (వంచించు) చుండువాడు మాలవాడనబడును.

దారిద్ర్యము సంభవించినపుడు అడుగడుగునా భర్తతో పోట్లాడే భార్య మాలది యనబడును.

మహాత్మా పురందరదాసు

## వాచిక ధర్మములు

శ్లో. లోకవార్తానుగమనే జిహ్వైకా సహస్రధా
ఈశవార్తానుగమనే ద్వాత్రింశ ద్దంతకీలితా.

తా. నాలుక వ్యర్థములైన లోకవార్తలను గురించి అనేకములుగా మాట్లాడుచుండును. భగవత్సంబంధము లైన ధర్మములను చెప్పుమనునపుడు ముప్పదిరెండు దంతముల మధ్య దాగుకొని మాట్లాడక యుండును.

పుణ్యములేని వాక్కు వ్యర్థముగను, అసత్యముగను, కఠినముగను మాట్లాడును.

శ్లో. న నిందాం స్తుతిం కుర్యాత్ న కించిన్మర్మణి స్పృశేత్
నాఽతివాదీ భవేత్తద్వత్ సర్వత్రైవ సమోభవేత్.

తా. ఎవరినీ నిందించరాదు, పొగడనూ కూడదు. ఇతరులకు నొప్పి కలుగునట్లు మాట్లాడ కూడదు. అధికముగా మాటలాడరాదు. అన్నిచోట్ల సమముగా నుండవలెను.

ఒకరిని నిందించినచో అతనిపై ప్రేమగలవారు నీతో కలహించి నిన్ను బాధ పెట్టెదరు. ఒకరిని పొగడినచో అతనిపై విరోధముతో నున్నవారు నిన్ను దూషించెదరు. కావున స్తుతి, నిందలు చేయకుము.

శ్లో. నాఽనిష్టం ప్రవదేత్ కశ్మిన్ న ఛ్ఛిద్రం కస్య లక్షయేత్
ఆజ్ఞాభంగస్తు మహతాం రాజ్ఞః కార్యః నవై క్వచిత్.

తా. ఎవరికిని అపకారము గలుగు మాటలు పలుక కుము. ఇతరుల లోపముల నెంచకుము. మహాత్ముల ఆజ్ఞలను, ప్రభుత్వముయొక్క నియమములను తప్పి నడువకూడదు.

శాస్త్రధర్మములను సద్గురువుల యాజ్ఞలను తప్పి నడిచినచో పాపమును, అజ్ఞానమును పెరుగును. ప్రభువుగారి ఆజ్ఞలను విడిచి వర్తించినచో ఉద్యోగము పోవును. రాజ దండన సంభవించును.

శ్లో. న స్వపరః ప్రియవాదినామ్

తా. ప్రియముగా మాట్లాడువారికి నావారు, నీవారు యనునది లేదు.

## మౌన సమయములు

శ్లో. మేహానే మైథునే స్నానే। భోజనే దంతధావనే
ఇజ్యాయాం సహహోమేచ। జపే మౌనం సమాచరేత్.

ఉ. మలమూత్రములను విడుచునపుడు, సంభోగ సమయమున, స్నానము చేయునపుడు, భోజనము చేయునపుడు, దంతధావనము చేయునపుడు, పూజ, యజ్ఞము, జపము చేయుచుండునపుడు మౌనముగా నుండవలెను.

## మమకార బంధము

ప్రశ్న : స్వామీ! దుఃఖమునకు కారణ మేది?

ఉత్త : 'నావి, నావారు' యను మమకారమే దుఃఖమునకు కారణమగును.

నేను అను అహంకారము నుండియే మమకారము కలుగును.

నా దేహ మను మమకారమువలన నన్ను దూషించిరి, నన్ను కొట్టిరి, నా తప్పులను వెదకిరి, నాకు జబ్బు చేసినది. నన్ను దోమలును తేళ్లును కుట్టినవి యనియు బాధపడు చున్నారుగదా! నిద్రలోను పరమాత్మ దృష్టిలోను ఉన్న వారికి అహంకారము, మమకారమున్ను లేవు గదా!

నా గృహము, ధనము, భూమి, భార్య, బిడ్డలనెడి మమకారమున్నంతవరకును బంధము, దుఃఖము లుండును.

వివాహము కాకున్నపుడు నా భార్య యనెడి మమకారములేదు. వివాహమైన తరువాత నా భార్య యను మమకార మేర్పడినది. అందువలన భార్యకు జబ్బు చేసినను, మరణించినను దుఃఖము నొందుచున్నారు. వైరాగ్యము చేతగాని, కలహముచేతగాని భార్యా భర్తలకు వియోగము

సంభవించినపుడు మమకారము లేకపోవుటవల్ల బాధ కలుగదు. భార్యను వదలి ఇంకొక స్త్రీని పెండ్లిచేసికొనినపుడును, మొదటి భార్య క్షేమముగా నున్నను, మరణించినను బంధము, బాధయు లేవు గదా!

ప్రశ్న : మమకారము ఎపుడేర్పడినది? నిర్మమత్వమెపుడేర్పడినది?

ఉత్త : నాది యనుకొనినపుడు మమకార బంధమేర్పడినది. నాది కాదు యనుకొని నపుడు నిర్మమత్వమేర్పడినది. ఎట్లన నీ భూమి నీ యధీనములోనున్నంత వరకు నాది యనుకొంటివి. ఆ భూమిని ఈరోజున దేవాలయమునకో మఠమునకో, కుమార్తెకో, కుమారునకో ఇచ్చివేసినచో నాది యను మమకారము పోయినది గదా!

ఈరోజున నీ యధీనములో నున్న గోవును నాది యనుకొంటివి. రేపు ఆ గోవును అమ్మివేసినను, దానము చేసినను మమకారము నశించుచున్నది గదా!

సంపాదించినపుడు మమకార మేర్పడినది. వ్యయమైనపుడు మమకారము నశించుచున్నది.

బజారులో వస్తువులను కొని ఇవి నావి యని బంధమును తెచ్చుకొనుచున్నారు. అవి పోయినపుడు 'నా వస్తువులు పోయిన'వని ఏడ్చుచున్నారు. దీనినిబట్టి బంధము, మోక్షమున్ను మనలో గలవని తేలుచున్నది గదా! సర్వము దేవుని దేయను నిశ్చయముతో నుండి సేవ చేయుచు, శరీరము

నకు కావలసిన వాటిని తీసికొని అనుభవించుచు జీవించు చుండువారే ధన్యులు.

## పునర్జన్మ కలదా?

ప్రశ్న: స్వామీ! కొన్ని మతములు పునర్జన్మ కలదని చెప్పుచున్నవి. కొన్నిమతములు పునర్జన్మ లేదని చెప్పు చున్నవి. ఈ రెండు సిద్ధాంతములలో ఏ సిద్ధాంతము నమ్మ దగినది?

సమా: పునర్జన్మ కలదు యను సిద్ధాంతమునే నమ్మవలెను.

ప్రశ్న: పునర్జన్మ సిద్ధాంతమును నమ్మినచో కలుగు ఫలితమేమి? నమ్మనిచో గలుగు దోషమేమి?

సమా: పునర్జన్మ సిద్ధాంతమును నమ్మనిచో మానవులు భోగములను ముఖ్యముగా దృష్టి యందుంచుకొని చేయరాని పనులను చేయుచుందురు. పాపభీతి, నీచజన్మలు, రోగాది బాధలుగల జన్మలున్ను కలుగునను భయములేని వారై స్వేచ్ఛావిహారులై చెడిపోకుండుటకుగాను పునర్జన్మను నమ్మియుండినవారు జీవితమును జాగ్రత్తగా నడిపించుకొన గలుగుదురు.

పునర్జన్మను నమ్మనివారు హింస, దొంగతనము, వ్యభిచారము, అసత్య సంభాషణ, హత్యలున్ను చేయుచున్న వారై ఈలోకమున సుఖము, కీర్తియు లేనివారగుదురు. మరల జన్మమెత్తి, అంగహీనులుగా, రోగులుగా, దరిద్రులుగా,

